Regd No. N. 46 / M. 3813

వెల ఒక అణా

గోలకొండ డైరీ
అయిపోవచ్చినవి
వెల
౧ రూపాయి

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హిందువుల పండుగలు
కర్త
సు. ప్రతాపరెడ్డి
౩౦౦ పుటలు ౫ పటాలు
వెల ౧ రూ॥ మాత్రమే.
మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆశ్వయుజ బ॥ ౪ (౯-౧-౧౩౫౧ఫ.) గురువారము ★ సంచిక ౪౪

# రష్యాలో జర్మనుల క్రొత్తపోటు

## హిట్లరు ఉపన్యాసములో తెల్పుట

### రష్యాజర్మనీల యుద్ధము

రష్యాజర్మనీల యుద్ధమునుగురించి అక్టోబరు ౨ వ తేదినుండి ౫ వ తేదివరకు వచ్చినవార్తల లో లెనిన్గ్రాడురంగమందును, ఒడెస్సారంగము నందును రష్యనులసేనలను, రుమేనియాసేనలను వెను కకుతరుముగొట్టుచు చాలదూరముపడచినట్లు ప్రధానముగా కనిపించుచున్నది.

కరేలియాలోఫిన్నులసేనలు ముఖ్యపట్టణము ను కొన్నిటినిపట్టుకొనినట్లు ఫిన్నులుచెప్పుకొను చున్నారుకాని వారిసేనలక్రుకొంగమనము కుంద గించియున్నది. మర్మాన్స్కుసపడమట లిట్జావ నివద్ద జర్మనుసేనలను రష్యనుసేనలు పూర్తిగాఓ డించినట్లును, అక్కడినుండిజర్మనుసేనలు చాలా నష్టములోపారిపోయినట్లును అక్టోబరు౫వతేదీవార్త లోనున్నది. కరేలియాలో ఒకముఖ్యనగరమును వైలాంక్ష నుపట్టుకొన్నామని రష్యనులు ౪వతే దిన ప్రకటించిరి.

లెనిన్గ్రాడువద్ద మంచుపడుచుండుటవల్ల జర్మను సేనలు వేగముగాముందుకుపడచుట కష్టము గనున్నది, లెనిన్గ్రాడునుఇంతవరకు జర్మనుసేనలు సమీపించలేదని ఇప్పుడువార్త తెలిపినది. చాల చోట్ల రష్యావారిసేనలు జర్మనులనుదూరముగాపె నకకుతరిమివేసినవి. లెనిన్గ్రాడుకు దక్షిణమున ౧౨౫మైళ్లదూరమున ఇల్మెనుసరస్సువద్దసరయా రస్సాలో రష్యావారు జర్మనులనుతరుమగొట్టి ౪ గ్రామాలను స్వాధీనముచేసికొనిరి లెనిన్గ్రా డుకు జర్మనుసేనలక్రొత్తగా తేబడినవి. ఇక్కడర ష్యావారు క్రొత్తరకపుటాంకులనుప్రయోగించుచు న్నారు. ఇప్పుడురష్యావారిసేనలిక్కడ ౩ మైళ్ళు ముందుకుపడచిపోయినవి.

మధ్యరంగంలోకూడ రష్యావారు మరికొన్ని గ్రామాలను స్వాధీనముచేసికొని ౧౩ మైళ్ళ దూరమైగా జర్మనులనుతరుముకొనుచు ముందుకుపో గల్గినారు.

యుక్రెయిను నగరములో పోల్టావాను పట్టుకొ న్నతర్వాత జర్మనులగమనము మందముగానున్నది. వారలుఖార్కొవులనే గొప్ప పారిశ్రామికనగర మును పట్టుకొనబోవుచున్నారు. ఇప్పుడుదానికి ౭౦మైళ్ళ దూరములోనున్నారు. ఇక్కడరష్యా సేనలు ఎదురుదాడులుచేయుచున్నవి. ఈకొన్య మునుండికూడ రష్యనులు దెబ్బతీయుచున్నారు. ఈచర్యసఫలమైనచో క్రిమియాకుమార్గమైన పెరి కోపులో జర్మనులుఉండుటకు గాదిక్కుపోగలదు

ఒడెస్సారంగములో రష్యావారు ఈమూడు రోజులలో ౩౦ గ్రామాలను జర్మనీయు, రుమేనియు సేనలనుండి పునరాక్రమించిరి ఈ రంగములో జర్మనులు మొదటిసారిగా సైనికులను మోసికొని వచ్చుటకుపయోగించు గ్లైడర్లు అను విమానము లను ఉపయోగించుచున్నారు.

ఇక క్రిమియారంగము ఇక్కడ జర్మనులు ఇప్పటికి పెరికోపుభూసంధి దక్షిణాగ్రమునకు చేరగల్గిరేగాని క్రిమియాలో ఇంకను ప్రవేశించ లేదు. రష్యనులు ఇక్కడ చాలతీవ్రముగా ప్రతి ఘటించుచున్నారు.

అజోవుసముద్రపు ఉత్తరప్రాంతములో నీప ర్ నదికి పశ్చిమదిశగా రష్యనులు పూర్తిగాతిరో గమనము సాగించుచున్నట్లు జర్మనులు చెప్పు చున్నారు

రష్యాయుజర్మనులపహాయార్థమై ఫ్రాంసునుండి ఫిరంగులు సైనికదళములు తేబడినవి ఇప్పుడుఫ్రా న్సులోని జర్మనుసైనికులకు దుడ్డుకర్రలుమాత్రమే మిగిలియున్నవట.

ఇప్పుడు జర్మనులస్థలాలపైనను పామగ్రులపై నను, సేనలపైనను బాంబులువేయు విమానాలకు రక్షణగా బ్రిటిషుపోరాటపు విమానాలుకూడా తిరుగుచున్నవి. భారతదేశమునుండి ఈరానురో డుగా రష్యాకుకావలసిన సామగ్రిలుపంపబడుచు న్నట్లుకూడ వార్తలువచ్చినవి, ఇప్పుడు యుద్ధంలో జర్మనులకు చాలానష్టములుకలుగుచున్నట్లు రష్యా వారు ప్రకటించినారు.

ఈ యుద్ధారంభమున రోజు ౧౪౬ మైళ్ళ వంతున ముందుకుపోగలిగిన జర్మనులు ఇటీవలరో జు ౧౪ ౫ఫర్లాంగులవంతున మాత్రమేముందు కుపోయినట్లు లెక్క తేలినది- అయినను రష్యాలో పరిస్థితి విషమంగానున్నట్లు రూటరు విలేఖరి విమ ర్శించినాడు.

### హిట్లరుగారి ఉపన్యాసము

అక్టోబరు౩వతేదిన మధ్యాహ్నము ౩½ గంటల కర్వాతనుండి హిట్లరుగారు బర్లినునగరము నుండి రేడియోలో ఉపన్యసించిరి- ఈ ఉపన్యాసము నిచ్చుటకై వారు యుద్ధరంగములో వేసికొని యున్న శిబిరమునుండి ప్రత్యేకముగావచ్చిరి-వారు శీతకాల సహాయకార్యములను జరుపవలసినదని ప్రజలకువిన్నవించుటకై నాజీపార్టీవారు ఏర్పాటు చేసినసభ సందర్భములో ఉపన్యసించిరి- జర్మనీ తనయిచ్ఛపై యుద్ధముకావలెనని తెచ్చిపెట్టుకొన లేదనియు, ఇంగ్లీషువారు తన సమాధాన రాయ బారమును తిరస్కరించుటవల్ల ప్రపంచచరిత్రలో మారేండ్లకాలము ముఖ్యమైనదిగానుండగల నిర్ణ యమును తెల్పుటకై యుద్ధము చేయవలసివచ్చెనని యు చెప్పిరి-రష్యా విదేశాంగమంత్రి మొలటావు గారు బర్లినుకువచ్చినప్పుడు ఫిన్లెండును రూపుమా పవలెనని కోరిరట. తాను అందుకంగీకరించలేదని హిట్లరుచెప్పెను-రుమేనియాపై రష్యాదాడిచేసినచో రుమేనియారక్షణకై జర్మనీయిచ్చిన అభయవచన ము నిలుపుకొనబడు నాయని మొలటావుగారు అడి గిరట-అట్లుమాటనిల్పుకొనుట తప్పదని హిట్లరు బదులిచ్చెనట బల్గేరియాకు రష్యాసేనలను పంపి బల్గేరియాకు రష్యావారిగ్యారంటీ నొసగనీయవల సినదని మొలటావుగారుకోరగా హిట్లరుగారు ఆ విషయము బల్గేరియాఇష్టమనియు, తాను మిత్రదే శములతో సంప్రదించగలననియు చెప్పిరట-డా ర్డనెల్సులోకూడ స్థానములు కావలెనని రష్యావా రుకోరిరట-ఇందుకును హిట్లరు ఒప్పుకొనలేదట- మొలటావుగారు బర్లినునుండి రష్యాకుపోయినది మొదలుకొని హిట్లరు రష్యాచర్యలనుమామముం దగా రష్యాజర్మనీపైనదాడిసంకల్పించుకొన్న ట్లు ఆధారములుచిక్కినవట- అందుచే ఇపుడు రష్యాతో జర్మనుసేనలు యుద్ధము చేయించబడు చున్నవని హిట్లరుగారుచెప్పిరి. రెండురోజులనుం డి రష్యా యుద్ధరంగంలో బ్రహ్మాండమైనపోటు ఒకటి జర్మనులచేచేయబడుచున్నదనియు తూర్పు న శత్రువును ఓడించుటకది తోడ్పడగలదనియు హిట్లరుచెప్పెను- ఇప్పటివరకు ఈ యుద్ధములో ౨౫లక్షలమంది రష్యనులు ఖైదుచేయబడిరనియు, ౨౨౦౦౦ ఫిరంగులు, ౧౮ వేల టాంకులు, ౧౪౫౦౦ విమానములు రష్యనులవి నాశముచేయ బడినవని హిట్లరుచెప్పెను.

### చలికాలపు యుద్ధమునకై ౫ లక్షలసేన

రష్యాసేనానులలో నొకరగు బ్లూచరీగారు తూర్పురష్యాలో ఒక సంవత్సరమునుండి ౫ ల క్షల మందినిమంచుగడ్డలమీద నిపుణులై యుద్ధ ముచేయగలుగునట్లుగా తయారుచేయుచున్నారు చలికాలములో జర్మనులతోయుద్ధముచేయుటకు వీరలుపయోగింతురని ఉద్దేశ్యము_రష్యాతో యు ద్ధముచలికాలములోకూడ జరుగునని జర్మనుప్రభు త్వాధికారులు జర్మనుప్రజలకును ఇటాలీయు పత్రికలు ఇటాలీయుప్రజలకును చెప్పుచున్నవి

### జర్మన్ సేనానిరాజీనామా విఫలత

ఇప్పుడు లెనిన్గ్రాడుపై జర్మనుసేనలను నడు పుచున్న జర్మనుసేనానిమార్షల్ వాన్ లీబ్ రాజీనా మానిచ్చెదనని హిట్లరును కోరగా హిట్లరు అనే నానికి అప్పగించినపనిపూర్తిగానందునలేదురాజీ నామానీయ వీలులేదనినాడు.

### తుర్కీ-జర్మనీల వర్తకపుఒడంబడిక

తుర్కీ-జర్మనీలమధ్యకుదిరిన వర్తకపుఒడంబడి కలో ఒకోట్లతుర్కీ-లైరులవిలువగల సామగ్రిని జర్మనీతీసికొనునట్లు ఒప్పందమకుదిరినది. తుర్కీ- వారు జర్మనులకు క్రోమును ఇప్పుడివ్వరుగాని ౧౯౪౩ వసంవత్సరాంతమున ఇత్తురనిజర్మనులు చెప్పుకొనుచున్నారు, అక్టోబరు ౯వతేదిన ఒడం బడికపత్రముపై ఉభయపక్షప్రతినిధులును సం తకములనుచేసెదరట

### అమెరికానౌకలపై జర్మనులదెబ్బలు

అమెరికానౌకలపై జర్మనులదెబ్బలు హెచ్చు చున్నట్లు కనిపించుచున్నది, పనామాకేంద్రాధరిం చిన "ట్రినిడాడ్ అనుఅమెరికానౌక ఒకజర్మను యూబోటునుండి వేసినదెబ్బలవల్ల సముద్రంలో మునిగినట్లును, అందలి ౧౦ మంది ప్రాణావశిష్టు లొకప్పుయినుతేపులోచేరినట్లును సెప్టెంబరు ౨౯ వతేది నాటివార్తలోగలదు అమెరికాపెట్రోలు నావయగు "ఐ.సి వైటు" కూడ సముద్రములో ముంచబడెను. దక్షిణఅమెరికా ఉత్తరభాగమున అల్లోవాటుదేశపుతేవులకు మారగోగైపునకు ౫౦ ౦ మైళ్ళదూరమున దక్షిణఅట్లాంటికు సముద్రము లో అక్టోబరు ౪వతేదిరాత్రి గొప్పనౌకాయుద్ధ ముజరిగినది, ఒకయుద్ధనావకుదెబ్బతగిలి ఒడ్డునుం డిమాచుచున్నవారలకు మునిగినట్లుతోచెను. ఇది ఏదేశాలనావలో తెలియుటలేదు.

ఇప్పుడుఅమెరికాసంయుక్తరాజ్య విదేశాంగ మంత్రి అమెరికావర్తకపునౌకలకు ఆయుధముల సహాయమునుచ్చుటకై తాటస్థ్యశాసనమువల్ల ఆట కములేకుండ దానిని సవరింపగోరుచున్నారు.

### సింగపూరురక్షణకై బ్రిటను,అమెరికాల సహాకారము

సింగపూరుపైకి శత్రువుదండెత్తివచ్చుచో అ మెరికావారు ఏమిసహాయమును బ్రిటిషువారికిచే సెదరనువిషయంలో సింగపూరులోని బ్రిటిషుసే నానిఏరీమార్షల్ బ్రూకుపోపహాంగారును,అమె రికాసైన్యాధిపతి ఫీల్డుమార్షలు మాకు ఆర్థర్ గారును అక్టోబరు ౩,౪,౫, తేదులలో సంభాషించుకొని నటుకనపడుచున్నది.

### ఉత్తరచైనాలో జపానుసేనల యుద్ధము

ఉత్తరచైనాలో హూనానురాష్ట్ర ప్రధానన గరమగు చాంగ్షావద్ద ఓడినతర్వాత జపానుసేన లుపెహింగు హాంగ్ కొకైర్వే లుంగాయి రైల్వేతో కలియుచోటనుండే చెంగ్చౌపట్టణములో ప్రవే శించినట్లు జపానువారుప్రకటించుకొన్నారు. ఇ ప్పుడుచాంగ్షాకుఉత్తరమున కెల్టావు,లియాయాం గులనువదులమధ్య చైనా, జపానులసేనలకు తీవ్ర మైనయుద్ధముజరుగుచున్నది.

### ఇరానులో జపానుహక్కు భంగము

ఇరాను ప్రధాననగరమగు టెహరానులో జ పాను రాయబారికిగలహక్కులను ఇరానుప్రభు త్వమువారు రద్దుచేసినందుకు జపానుప్రభుత్వము వారు ఎందుకిట్లుచేసిరారని ఆక్షేపించినారు. అ క్కడిఒకజర్మనీయుడు జపానురాయబారి గారి ప్రదేశంలో శరణుచొచ్చియుండగా ఇరానుప్ర భుత్వమువారెంతగా అడిగినను జపానుఅధికారు లు ఆజర్మనీయునిఇచ్చివేయనందున ఇరానుప్రభు త్వమిట్టిచర్యగైకొనినట్లు ఒకజపానువార్తలో తె లుపబడినది.

### డచ్చి ఈస్టిండీసుకు జపాను బెదరింపు

డచ్చిఈస్టిండీసువారు రష్యావారికి జపాను సరిహద్దు నానుకొనియుండే వ్లాడివోస్టాకు రేవు గుండా పెట్రోలు, ఇతరయుద్ధసామగ్రిని పంపిం చుచున్నట్లు జపానుప్రభుత్వానికి తెలిసినట్లును ఈపని జపానుకు విరుద్ధచర్యయని తలచబడునని యు జపానుప్రభుత్వప్రతినిధి యొకరు అక్టోబరు ౩వతేదిన చెప్పినాడు: అమెరికా, జపానులకు ఇంకను రాయబారములు జరుగుచున్నవనియు అత డు చెప్పినాడు.

### రాజపుత్రునకు మతవిద్య

మ-ఘ-శ- నిజాంప్రభుగారికుమారులగు కౌల్ మొజంజాబహదర్ గారికి మతవిద్యకొరకై మౌలానా మసయ్యాద్ మహమ్మద్ ఫరీదసాహేబ్ గారిని ఏర్పాటుచేసినారు-

### సికింద్రాబాదులో జ్వరాలు హెచ్చుట

సికింద్రాబాదులో జ్వరాలుహెచ్చి కే- ఇ యం- ఆస్పత్రిలో చాలమందిరోగులకిక్కిరి సినది. అందువల్లసికింద్రాబాదు కంటోన్మెం టు వైద్యాధికారిగారు ఇందుకుతగినఏర్పాట్లు చే యుచు అక్కడిడాక్టరులనందరిని వారివద్ద ఇ ప్పుడుండేజ్వరపీడితులను తమవద్దనుచికిత్సకై కం పించవలెననియు, అందరికినిఉచితంగా విషజ్వర మును రాకుండచేయు టీకాలొసగబడు ఏర్పాటు చేయబడినదనియు తెలియచేసినారు.

జిల్లాలలో

## దసరా ఉత్సవవిశేషములు

మ-ఘ-వ-నిజాంరాష్ట్రమందుజిల్లాలలో దసరా ఉత్సవవిశేషములనుగురించి మాకువార్తలనేకములుచేరినవి.

### పోలీసు ఉద్యోగుల ఆటంకము

వరంగల్లునుండి వచ్చినవార్త. అశ్వయుజ శు౧ నుండి శు౧౦ పర్యంతము శ్రీఅకారపు నరసింగశాస్త్రిగారు శ్రీకాశీవిశ్వేశ్వర దేవాలయమందుశరన్నవరాత్రోత్సవములను జరిపినట్లు తెలుపుచున్నది. వరంగల్లుజిల్లాలోనే కరీమాబాదు మద్యపాననిరోధసంఘమువారు విజయదశమినాడు ౩౦౦ మందికి కల్లు, సారాలవల్లకలిగేనష్టమును ప్రదర్శించిరి, సంఘకార్యదర్శిగారు ఆదేవిషయమునుగురించి ఉపన్యాసముచేసిరి- కరీమాబాదు జాగీరు గ్రామములో ప్రతిసంవత్సరము బురుజావద్ద ఆయుధపూజజరుగుచుండెడిది. ఈసేడు ఆబురుజావద్ద విజయదశమిరోజున మంచముశేసికొనియుండిన జవానుగారు పూజచేయుటకు వచ్చినవారలకు ఏదోఆటంకము తెలిపిరి. అందుపై పూజకువచ్చినవారలువెళ్లిపోయిరి. ఈసంగతిపోలీసువారికి తెలిసి అమీన్ గారువచ్చివిచారించి జవానుగారిని, వవంకటయ్యగారిని మరొకరిని అమీన్ కచేరికితీసికొనిపోయిరి. అక్కడ సర్కిల్ ఇన్స్పెక్టరుగారు వారలతో ఈసంవత్సరముఏదియుచేయవద్దనియు వచ్చేసంవత్సరము విచారించగలమనియుచెప్పిరి- తర్వాత ౧౮౮ వ సెక్షన్ అమలుచేయబడెను. మార్వాడి రామాలయమునుండి సేవగుట్టవద్దకుపోయి తుపాకితో రావణాసురునికొట్టిరి.

నల్లగొండజిల్లాలో సూర్యాపేటయందు విజయదశమినాడు ప్రాతఃకాలము ప్రభాత్ఫేరీ, సాయంకాలము ఆర్యసమాజభవనమున సభజరిగెను. శ్రీఅమరువాది వేంకటవరసయ్య (మంత్రి) గారు, శ్రీ డా॥ శర్మగారు దసరా ప్రాముఖ్యమునుగురించిప్రబోధించిరి తర్వాతసభికులెల్లరు గ్రామముకెలుపలనున్న జమ్మిచెట్టునకు పూజలుసలిపి ఇండ్లకుపోయిరి.

నల్లగొండ జిల్లాలోనే మిరియాలగూడెములో ఆర్యసమాజ భవ్యమున ప్రధానులైన జె. అ: నారాయణగుప్త (వకీలు) గారి యాజమాన్యమున హవనము తర్వాతఆర్యసోదరులఊరేగింపుజరిగెను. ఈసమాజపు రాత్రిపాఠశాలలోని బాలురకు దాదాపు ౪౦ మందికి ఖద్దరుచొక్కాలు దానముచేయబడెను. ఊరేగింపుశివాలయమునకు చేరుకొన్న తర్వాత అక్కడ ప్రధానిగారు దసరాపండుగ ప్రాముఖ్యమునుగురించి ఉపన్యసించిరి. పిమ్మట ఆర్యసమాజికుల ఊరేగింపు శివునిఊరేగింపుకలసి శమీవృక్షమువద్దకుపోయినవి. అక్కడదాదాపు ౪౦౦౦ మంది ప్రజలకు వైదికధర్మోపదేశ గీతములు వినిపించబడెను. రాత్రి ౯ గంటలకు సమాజభవనమందు ప్రధానిగారు స్థానికాధికారులకు అల్పాహారవిందొసగిరి. రాత్రి ౧౦ గంటలకు కృతజ్ఞతా వందన సమర్పణతో కార్యక్రమము ముగిసెను.

౪౦ మంది మద్యవిసర్జన ప్రమాణము.

ఇదేజిల్లాలో జనగామకు ౨ మైళ్ళదూరములో చీటకోడూరుగ్రామమందు కొందరు యువకులు శివబలితగదని ప్రచారముచేయుటవల్ల విజయదశమినాడు పొట్టేళ్ళుబదులు సొరకాయలను బలియిచ్చిరి. ౧౩౫౦ ఫ, అబాన్ ౨౧ వ తేదిన పెంబర్తికలో జరిగినమద్యనిషేధ సభకు పోయియుండిన కొందరు నవయువకులు ఇదేగ్రామప్రజలకు మద్యదోషములను గురించి బోధించగాసుమారు ౭౦ మంది ఇదిమొదలుకొని మద్యముసేవించమని ప్రమాణముచేసిరి. జనగామతాలూకాలోనే చీటకోడూరుగ్రామప్రజలు గ్రామాధికారుల ప్రోత్సాహముచే సాత్వికపూజజరిపిరి.

మెదకుజిల్లాలోని సదాశివపేటలో విజయదశమినాడు ఉదయం ౪.౩౦ గంటలకు ఆర్యసమాజకార్యాలయమందు బృహద్యజ్ఞము తర్వాత ప్రధాని బాశెట్టివిశ్వనాథంగారుధ్వజారోహణచేసి ధ్వజరహస్యమునుగురించి ఉపన్యసించుటజరిగెను. సాయంకాలము ౩-౩౦ గంటలనుండి సుమారు ౩౦౦ మందిగల ఊరేగింపుసశస్త్రముగా జరిగెను పోలీసువారు ఊరేగింపు కిరుపార్శ్వములనుండి శాంతినిరక్షించిరి. ఈ జనము మాలపటేలుగారి పొలములోకిపోయిన తర్వాత అక్కడయువకులు కఱ్ఱలతోను కత్తులతోను ఆటలుప్రదర్శించిరి. శ్రీ శంకరదేవ్ గారును, శ్రీబసప్పగారును విజయదశమి చరిత్రము తెలిపి, పూర్వము శ్రీరామకృష్ణాదులు క్షత్రియధర్మమును కాపాడినట్లే నేడునులోపించియున్న క్షత్రియత్వమును ఉద్ధరించుటకు యువకులు కంకణముకట్టవలెనని ప్రబోధములజేసిరి, తర్వాత ఊరేగింపుతిరిగి సమాజభవనమునకు చేరుకొనెను, ఇదేవిధముగ వీరశైవసమాజమువారును, ఆర్యవైశ్యసమాజమువారును, పద్మశాలి సమాజమువారును ఊరేగింపులుతీసిరి.

ఆసట్ల గ్రామములో అబాన్ ౨౧వ తేదిన దసరా సందర్భములో సుమారు ౧౦౦౦ మంది జనులు భక్తసమాజమువారి పక్షమున ఓంపతాకమును ఊరేగించిరి. హరిజనులుకూడ పాల్గొనిరి.

మెదకుజిల్లాలో అందోలుతాలూకాలో మరవెల్ల గ్రామమందు దసరాపండుగ ఒక్కయుజశుద్ధ నవమి సోమవారమునాడు జరిపినారట.

### ఆర్యసమాజపు ఊరేగింపు ఆగిపోవుట.

మహబూబునగరంలో ఆర్యసమాజమువారు దసరాఊరేగింపు జరుపుకొనుటకై దసరారోజుకంటె ౧౫ రోజులు ముందుగా తహసీల్దారుగారికి విజ్ఞాపనపత్రము పంపుకొనిరి-తర్వాత ౩ రోజులకు ఊరేగింపుపొయ్యే స్థలములను అధికారులకుచూపించిరి. ఇంకను విశదముగా తెలుపవలసినదని అధికారులుకోరిరి. విశదముగా తెలుపబడినది ఊరేగింపుపోవుస్థలములలో మసీదులుకూడలేవని తెలుపబడెను. తర్వాత అధికారులు గ్రామములలోప్రకటనచేసిరి. ఆర్యసమాజమువారు అనుమతి యొసగబడువరకు ఊరేగింపు తీయరాదని వారలకు అధికారులునోటీసునిచ్చిరి. తర్వాతఆక్షేపణదరఖాస్తు మహమ్మదీయులనుండి వచ్చినదనియు, స్థానికపరిస్థితులుబాగులేవని రక్షకశాఖనుండి తెలిసినదనియు తహసీల్దారుగారు ఆర్యసమాజీయుల ఊరేగింపునకు అనుమతొసగరాదని తాలూక్దారుగారికి అభిప్రాయముపంపించిరి-తాలూక్దారుగారు తహసీల్దారుగారి మాటను బలపరచుచు ఒకనోటీసును విజయదశమినాడుదయము ఆర్యసమాజమునకు అందజేసిరి- ఆయుధములుధరించకుండా ఉత్తరజండాఉత్సవము తీయదగునని అనుమతినొసగలేదు-కానిశెట్టప్పగారియింటినుండిసూత్రము జెండాను మేళతాళములతో తెచ్చి హనుమదాలయములో పూజచేసి పోలీసుస్టేషనువద్ద స్థాపించిరి-గొఱ్ఱెనుబలియివ్వలేదు-తాలూక్దారుగారు, ఆంధ్రనాయకులు మొదలగు జనము శ్రీ తిరుమలనాథస్వామి దేవాలయమునకు మేళతాళములతోపోయి స్వామిసేవను, శమీపూజనుజరిపిరి. ఆర్యసమాజ మందిరములో ప్రధానిగారు, రామమూర్తిగారు ఓంపతాకపుఊరేగింపునకు అనుమతియొసగనందుకు విచారమును తెలుపుచు ఉపన్యసించిరి. పాత పాలమూరిలో శ్రీ హనుమంతరావు వకీలుగారియింటిలో అందరును కూడి ఆయుధధారణకు అనుమతినీయలేదని విచారము తెలిపిరి.

వనపర్తి సంస్థానములోని యాపర్లగ్రామంలో శ్రీనవ నవ కన్యకాపరమేశ్వరీశరన్నవరాత్ర సందర్భములో గుంటూరుజిల్లావారగు వహోవాది వెంకటసుబ్బయ్య శాస్త్రిగారిచే హరికథలునాలో జులను చెప్పించబడినవి-సెప్టెంబరు౩౦వతేదిన శాస్త్రిగారికి రూ౧౧౫లుయిచ్చిసన్మానించిరి-ఇదే సంస్థానములో అమాడుబాకులగ్రామమందు విజయదశమినాడు ౧-౨౧గంటలవేళ వందకుమించిన జనులు, విద్యార్థులుసమావేశమై పుస్తకపూజనుచేసిరి. తర్వాత అందరును విద్య నేర్చుకొనవలెననియు, గ్రంథాలయమునకు అందరును ఒక్కొక్కటఅయినను రావలెననియు ఉపన్యాసములు జరిగినవి. కొల్లాపురంపత్రికలపత్రికలు కొన్ని సదరుగ్రంథాలయమునకు అందజేయబడెననియు. తమకువచ్చేకొన్నిపత్రికలు ఎక్కడికిపోవుచున్నవో తెలియుటలేదనియు, రెండువారములనుంచిబీటురాలేదనియు గ్రంథాలయ కార్యదర్శిగారు వనపర్తిగోడ్డు టప్పాయిబ్బందులను గురించి ఉపన్యసించిరి. పిమ్మట గ్రంథపూజచేసి అందరును ఇండ్లకుపోయిరి.

మహబూబునగరం తాలూకాలోని కొండాపురంలో అబాన్ ౨౧వతేదిన౧౦౦౦జనులకు బిల్లకంటిపీరారెడ్డిగారు ఆయుధములకుజంతుబలినిచ్చుటమంచిదికాదని ఉపన్యసించినతర్వాత నారికేళనైవేద్యముతో పూజముగించబడెను-పిమ్మట అందరును జమ్మిపూజకు పోయివచ్చినతర్వాత ౯గంటలవేళ పీరారెడ్డిగారు మద్యపానదోషములను గురించి ఉపన్యసించిరి.

ధోబీపేట (మునుగాల)లో విజయదశమినాడు గ్రామజనులు నాలుగైదువందల మంది శమీపూజకై సమావేశమైనపుడు శ్రీకొండపాపిరెడ్డిగారు విజయదశమినిగురించియు, గాంధిమహాత్ముని జన్మదినప్రీతికరమైన ఖద్దరునుగురించియు, మద్యదోషములనుగురించియు, ఆగ్రామంలో కుష్ఠరోగులు ౧౨౦మందియుండుటకు కారణముల గురించియుఉపన్యసించిరి-వ్యాధిగ్రస్తులు అన్ని బావులను వాడుట, చాకలివాండ్రు అన్ని వస్త్రములను కలుపుట, మంగళ్లు శస్త్రములనుకలిపి వాడుట, మద్యపాత్రలుకలియుట అవి కుష్ఠురోగవ్యాప్తి కారణముగా నున్నవనిరి.

కరీంనగరంతాలూకాలో గన్నేరువమందు దసరాకు నర్సింహస్వామి సేవతహసీల్దారు అనుమతిలేనిదితీయవీలులేదని ఆమేసుగారు దసరాకు నాలుగురోజులముందువచ్చి పూజారితోచెప్పిపోయిరట. రెండవరోజు పూజారితహసీలుకచేరికివెళ్ళి దరఖాస్తుపెట్టుకొనగా అనుమతియివ్వలేదు-మరల అచ్యుతరావువకీలు)గారు ప్రయత్నించినను అనుమతిదొరకలేదు-దసరాకు రెండురోజులముందు ౫౦-౬౦ మంది కరీంనగరమువెళ్లి అనుమతికొరకై తాలూక్దారుగారికి దరఖాస్తుపెట్టుకొనిరి-కాని లాభము కలుగలేదు.






# గోలకొండపత్రిక

వృషనామ సం||ర ఆశ్వయుజ బ|| ౮
గురువారము


## కావలసిన మార్పులు

అప్పుడప్పుడు ఉద్దేశ్యాలు వేరేఅయిగా పర్యవసానంలో మేమున్నా ఇత్తెహాదువారున్నా కొన్నివిషయములలో కొంతవరకు ఏకీభవించుతూఉంటాము. గత సంవత్సరము ఇత్తెహాదువారు కావించిన తీర్మానాలలో వాక్స్వాతంత్ర్యాది నిర్ణయములతో మేమేకీభవించియుంటిమి. ఇంచుమించు రెండువారాల క్రిందట నవాబ్ బహద్దర్ యార్జంగు బహద్దరుగారు లాతూరులో ఉపన్యసించుచు హైదరాబాదు ప్రభుత్వములో నాలుగుమార్పులు చాలా అవసరమైయున్నవని ప్రధానమంత్రిగారికి మహాసభద్వారా తెలియజేసియున్నారు. అవేవనగా

(౧) ప్రభుత్వానికి ఒక నిర్ణీతమగు విధానము (పాలిసీ) ఉండవలెను.

(౨) ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి విచారణ.

(3). ఉద్యోగాల నియామకములో పక్షపాతరాహిత్యము.

(౪) లంచముయొక్క నిర్మూలనము.

ఇవి బాగానేఉన్నవి. తక్కినమూడు మనవాళ్ళములోని విషయాలేకాని మొదటిదే కొద్దిగా మనకుమించినపనిగా కనబడుచున్నది. హైదరాబాదు రాష్ట్రము ఇతర దేశీ సంస్థానాలవలె బ్రిటిషువారి సార్వభౌమాధికారి (Paramount Power)తో లంకెపెట్టబడియున్నది. మనకు విదేశాంగతంత్రములేదు. కేవల ఆంతరంగిక తంత్రమే మనకువర్తించును. అందులోను ప్రధాన మంత్రివంటివాని నియామకములో వైస్రాయిగారి అనుమతిపొందుఆచారం చందూలాల్ కాలమునుండి ఏర్పడియున్నది. మరియు పూర్వమునుండియు ఈరాష్ట్రప్రభుత్వము అమీర్లతోను నవాబులతోను, రాజులతోను నడుపబడుచువచ్చినది. నేటివరకు సాధారణప్రజలలోనుండి ఏ మంత్రియు నియామకముకాలేదు. హై. ఆ. సర్. నవాబ్ అక్బర్ నవాజుజంగు బహద్దరుగారి మాటయేమి? అనంమరేమో! వారిబిరుదావళులే వారి నవాబీతనాన్ని ప్రకాశమానంచేయుచున్నవి. పైగా వారు ఈరాష్ట్రమువారుకారు. ౩౬ ఏండ్లు ఈ రాష్ట్రములో ఉండినందున ముల్కీనిర్వచనంలో చేరుట వేరుమాట. ఇట్టిసందర్భాలలో ప్రభుత్వానికొక పాలిసీని నిర్ణయించేదెట్లు?

"పెద్దఅధికారుల జీతాలు చాలా ఎక్కువగాఉన్నవి. అవిమాకు కంటకముగాఉన్నవి. మనవ్యయముపద్దులను చాలా తగ్గించవలెను" అని నవాబుగారన్నారు. ఇదినిజమే. మేమున్నూ అనేక సంవత్సరాలనుండి పలుమారు ఈవిషయమును గురించి వ్రాసినాము. కాంగ్రెసువారు ఉత్తమోద్యోగులకు ౫౦౦ రూ|| నెలజీతముకన్న హెచ్చుఇయ్యగూడదని నిర్ణయించిన కాలానికంటేముందుగానే చాలాయేండ్లనుండి మేమిదే అభిప్రాయమిచ్చుచున్నాము. మనరాష్ట్రములోని జీతాలు ఇంగ్లీషువారి స్కేళ్లనుబట్టి తీర్పిదిద్దుచున్నారు. ఇంగ్లీషువారిముచ్చట వేరు మనముచ్చటవేరు. అవసరములేని మంత్రిపదవులను తగ్గించవలెను. అలెవన్సులు పూర్తిగా చెక్కివేయవలెను. సర్కారీనౌకర్లను సొంతనౌకర్లనుగా వాడుకొనుట వెంటనేరద్దుచేయవలెను. కచ్చేరీల సెలవులతగ్గించవలెను. అధికారుల సెలవుల నియమాలుమార్చవలెను. ముష్పాతికసెలవుపద్దులను తొక్కివేయవలెను. సర్కారీబంగ్లాలు తీసివేయవలెను. మనప్రధానమంత్రిగారు పూర్వప్రధానమంత్రికన్న తక్కువజీతం తీసుకొనుచున్నారు. అది చాలా ప్రశంసనీయము. ఇంకను వారుతగ్గించుకొనవలెను. మనరాష్ట్రప్రధానమంత్రికి అలవెన్సు, బంగ్లా, నౌకరు చాకరు యావత్తుకలసి నెలకు ౩౦౦౦ హాలీలలోపలనే యుండవలెను. తాలూక్దార్ల సుబేదార్ల జీతాలు సరాసరిసగము కోసివేయవలెను. ౧౦౦౦రూపాయీల పైన నెలజీతాలుపొందే వారందరి జీతాలలోను భాగాకోతలువేయవలెను. ఇతరదేశాలనుపోల్చిచూచితే మనకు ఆశ్చర్యం కలుగకమానదు. మన భారతదేశమంత ౧౦అంతలున్నది రష్యాదేశము. మనహైద్రాబాదుకన్న ౧౨౦అంతలైనను ఎక్కువగా ఉన్నదాదేశము. కాని రష్యానియంతయగు స్టాలినుకు నెలకు ౧౦౦౦రూబుల్లజీతము. అనగా నెలకు ౭౦పౌనుల ౧౩షిల్లింగులు. అనగా ఇంచుమించు మన ౧౦౦ హాలీ రూపాయీలు! స్విస్సుదేశముయొక్క ప్రధానమంత్రికి సంవత్సరానికి ౧౮౦౦పౌనులు, అనగా నెలకు ౧౨౦౦ హాలీరూపాయీలు, బల్గేరియాదేశములోని క్యాబినెటుమంత్రికి నెలకు ౨౦ పౌనులజీతము. మనహైదరాబాదు మంత్రులకు ప్రతివానికిని ౩౦౦౦ రూ|| మించిన నెలజీతము అచ్చటిప్రొఫెసర్లకు నెలకు ౧౬పౌనులజీతము (౨౮౦హాలీలు) జడ్జీలకు ౧౬నుండి ౧౦పౌనులు నెలజీతము(౯౦నుండి ౧౮౦హాలీలు) మనహైకోర్టు జడ్జీలకు ౨౦౦౦రూ తక్కువనెలజీతమియ్యరు. హైస్కూలు టీచర్లకు ౭పౌనులు (౧౦౯హాలీలు) జడ్జికంటెతక్కువవారు కారు హైస్కూలుపంతుళ్లు! అయితేయింత తక్కువజీతండుంటే లంచాలుతప్పకుండా ఉంటవిసుమా అనికొందరు వాదించవచ్చును. "And there is no Baksheesh or bribery in Bulgaria" బల్గేరియాలో లంచగొండితనములేదు. బక్షీషు-ఇనాం-అన్నమాటలేదు- అని జాన్ గంథర్ గారు తమ Inside Europe అను గ్రంథములో వ్రాసినారు.

మనరాష్ట్రములో ఉద్యోగాలవిషయములో పక్షపాతముకూడదని నవాబుగారు సెలవిచ్చినారు. ఇది చాలామంచిమాట. కాని పెద్దఉద్యోగాలపై బయటివారునియమింప బడుచువచ్చినారు. వారివెంట బయటివారేదోవిధముగా వచ్చుచునేయున్నారు. ముల్కీసనగి లెట్లో దొరుకుచునేయుండును. మరియు సాధారణోద్యోగాలకుకూడా "మీపెద్దలు నౌకరీ చేసినారా? నీవుపెద్దవంశమువాడవా?" అని ప్రశ్నించుచున్నారు. అట్లయినచో ఉద్యోగాలకులము ఒకటియేర్పడుచున్నదన్నమాట. పూర్వము హైదరాబాదు కోత్వాలీపనిని పటేలుపట్వారీ ఉద్యోగమువలె అనువంశికోద్యోగముగా ఏర్పాటుచేసి ఒకేవంశమువారికే ఇచ్చుచుండిరట. అట్లే అన్నిఉద్యోగాలను "మౌరూసీ"గా చేసివేస్తే బాధయుండదు. లేదా ఈ విచిత్రప్రశ్నావళిని ఎత్తివేయవలెను. ఏ యధికారియైనను మొదట తనవారిని ఉద్యోగాలలో భర్తీచేసితీరును- తర్వాతబలీయమైన సిఫారసు యెవరికుంటే వారు విజయంపొందుదురు. నిజముగాఅర్హులైబీదలై దిక్కులేనివారినెవరడుగుదురు? ఈ విషయములో న్యాయమునుప్రసాదించుటకై ప్రభుత్వమువారు మంచికట్టుదిట్టమును ఏర్పాటుచేయుదురుగాక.

వందేమాతరం విద్యార్థులయెడ ప్రభుత్వోద్యోగము లిచ్చువిషయములో చాలా కాఠిన్యత వహించుచున్నారని వినుచున్నాము- ఇదే నిజమైనచో ప్రధానమంత్రిగారు ప్రత్యేకముగా ఈవిషయాన్ని విచారింపచేసి అన్యాయమును తొలగింపజేయుదురుగాక. ఉస్మానియా విద్యాపీఠ విద్యార్థులు గతసంవత్సరము అల్లరులను చేసియుండిరికదా దానికై ఒకకమిషనుకూడా విచారణార్థ మేర్పాటుచేసియుండిరి. దాని ఫలితమేమన్నదు బయటబడునో లేక పడనేపడదో దానితో మాకిప్పుడంతగా ప్రసక్తిలేదు కాని వందేమాతరం విద్యార్థులుచేసినపని పై అల్లరికన్న మించినవిషయముకానేరదు. వారికికొన్ని ఇబ్బందులుండెను. వాటిని తొలగింపకపోయిరి. అప్పుడు కొంతచర్య తీసికొనవలసివచ్చెను. తుదకు మరల అధికారులు పిల్లకాయలు సమాధానపడిన తర్వాతకూడా వారివెంటబడి పగసాధించుట సరియైనది కానేరదు.

తుదిలో లంచగొండితనాన్ని నిర్మూలించవలెనని నవాబుగారు కోరినారు. ఈవిషయములో వ్రాయవలసినది చాలాకలదు. మేము విన్నట్టిది చూచినట్టిది, కష్టాలనుభవించు వారిద్వారా నిరంతరము వినుచుట్టిదంతయు వ్రాసి ఆధారమును మానెత్తినవేసికొనలేము. ప్రభుత్వమువారు విచారణకు ఒక కమిషనేర్పాటు చేసినచో చప్రాసిచేతను, సేగేదారుచేతను, తుదకు మజారియావానిచేతను, ఏవిధముగా లంచాలు తీసుకొను ఆచారమేర్పడినదో వెల్లడికాగలదు. లంచగొండితనము ఎక్కువగా నుండుకొలది ప్రజలలో ప్రభుత్వమపకీర్తి పొందుచుండును. అధికారుల సౌమ్యత, ప్రసన్నత, సౌలభ్యత, లంచముతీసుకొనకుండుట, ప్రజలకుయిబ్బంది కలిగించకుండా వెంటవెంట వారి మొరలు వినుట అనునవి ప్రజలకు నిజముగా ఆనందము సంతోషము సౌఖ్యము కలిగించును. ఏ కచ్చేరీలోనైనను ప్రజల షికాయతుల కొరక అధికారి ప్రత్యేకింపబడినాడా? ప్రజల విచారణలకు జవాబిచ్చే నాథుడే కచ్చేరీలోనైనను నిర్ణయింపబడినాడా? ఈ అవసరము కలదని మేము పలుమారు వ్రాసినాము. కాని ఈయేర్పాటు కాజాలకపోయెను. ఇట్టి ఏర్పాటును బాగాతుకచ్చేరీలో తురాబలీగారొక్కరే ఏర్పాటు చేసియుండిరి. ఇప్పుడు వారు టప్పా డైరెక్టరైనారు. అచ్చటను ఇట్టియుత్తమపద్ధతి నేర్పాటు చేసినారనివిన్నాము. అట్టి అధికారులు మాకు బహుళము కావలెను. ప్రజలపై ప్రేమలేనివారుఎందరున్నా వారులేనట్లే!

## నూతన విద్యా విధానము

ప్రధాన మంత్రిగారికి ప్రజాపక్ష విద్యామహాసభా స్థాయిసంఘము విజ్ఞప్తి

హైదరాబాదు (దక్కను) ప్రజాపక్ష విద్యామహాసభా స్థాయిసంఘమువారు మ. ఘ. వ. నిజాం ప్రభుత్వాధ్యక్షులగు ఛత్తారి నవాబుగారికి స్వాగతమొసగుచు ఇటీవల క్రొత్తగా ప్రకటితమైన విద్యావిధానమును గురించి సమర్పించుకొన్న విజ్ఞప్తియొక్క సారమీక్రిందివిధముగానున్నది.

ఈరాష్ట్రమును పరిపాలనకైనూ బాగా విభజించుట భాషలనుబట్టియే అయియున్నది. అది ప్రకృతికి అనుగుణము గానున్నది.

ఉస్మానియా విద్యాపీఠముయొక్క విధానమును ఈరాష్ట్రమునందలి హిందూప్రజలకును మహమ్మదీయ ప్రజలకునుకూడ సమానముగా ఉపయోగించునట్లుగా ఏర్పరుచుట మంచిదనేకమని ౧౯౨౭లో హైసాక్రియు ఇర్విను గారు చెప్పినమాట ప్రాథమిక విద్యనుండి విద్యాపీఠ విద్యవరకును కూడవర్తించును. బ్రిటిషిండియాలో ప్రాథమిక విద్యమొదలుకొని మెట్రిక్యులేషను తరగతివరకు అనేక భాషలలో చదువు నేర్పుపద్ధతిని ప్రభుత్వము లంగీకరించియున్నవి. భాషలెక్కువగా ఉన్నవనుమాట ఈసంస్థానానికి మాత్రమే విశేషముగాదు.

ఇక్కడకూడ ౧౯౧౬వ సంవత్సరమువరకు సెకండరీ బళ్లలో ఇంగ్లీషుభాషలోనే విద్యనేర్పించుచుండిరి. తర్వాత ఉర్దూభాషలో నేర్పుటకు ప్రారంభించిరి అయినను హెచ్-యస్-యల్. సి. పద్ధతి ఉండవలెనని అనేకులు గట్టిగాకోరినందువల్ల, సెకండరీ గారినివేదిక ప్రకటన తర్వాతను సెకండరీ విద్యసంస్కరణము తర్వాతను కూడ హెచ్. యస్. యల్. సి. విద్యావిధానమునకు లోబడకుండ యుండునట్లు చేసిరి కాని ఇప్పుడు ౧౯౪౧లో గావించినరీతి సెకండరీవిద్యను ఉర్దూలోనే నేర్పు ఉద్దేశ్యముకలిగియున్నది- ఇక్కడి హెచ్-యస్-యల్-సి. బళ్లు యస్-యస్. యల్. సి. విధానమునకు చేర్చబడియున్నవి. అది ధానము ౧౯౪౧లో ఏర్పరచబడినట్టిది. దాని ప్రకారము "సెకండరీబళ్లలో విద్యార్థులమాతృభాషలోగాని, బడియేజిల్లాలోనున్నదో ఆజిల్లా ప్రధానభాషలోగాని విద్యనేర్పవలెను" అనియున్నది. దీనివల్ల మదరాసు విద్యాపీఠము అనేక భాషలుండుటవల్ల కలుగుచున్న చిక్కులను చాలా ఔదార్యముతో తీర్చినట్లు స్పష్టమగుచున్నది. ఇతరభాషలున్నవనే సంగతి లెక్కచేయకుండ పోవుటవల్ల ఈచిక్కుతీరజాలదు. హైదరాబాదువిద్యమునందవలెను- అట్టినానావిధములను ఏకలక్షణ సూత్రబద్ధములైయుండవలెను. ఈరాష్ట్రములో ఇట్లుచేయుటకు సంకల్పమున్నచో చాలినంత ధనముగాని సౌకర్యముగాని లేకపోలేదు.

మాతృభాషకానిఒక భాషనుతీసివేసి మరియొక మాతృభాషేతర భాషనుపెట్టుట మంచిమార్పుకాదు- క్రొత్తసవరణము "ఏకవిధపద్ధతి" కావలెనని మదరాసుప్రభుత్వమును ఎత్తిచూపుటవల్ల మదరాసుప్రభుత్వమునకు అన్యాయముచేయుచున్నది. మదరాసురాష్ట్రము మరొకఅడుగుముందుకు పోయినట్లు ౧౯౩౬-౩౭ సం|| పు విద్యాశాఖనివేదికలోని "ఉన్నతశ్రేణి తరగతులలో భాషాబోధతప్ప తక్కినశాస్త్రవిషయములన్నిటిని విద్యార్థులమాతృభాషతోనే నేర్పించవచ్చును" అనువాక్యమువల్ల తెలియుచున్నది.

ప్రాథమికతరగతులలో రెండు (ఉర్దూ, ఇంగ్లీషు) మాతృభాషేతరభాషలు ప్రవేశపెట్టబడినవి, మాతృభాషను సరిగా నేర్పుటలేదు ౬ ఏండ్లవయస్సు మొదలుకొని ౧౨ఏండ్లవయస్సువరకు ఈచిక్కు ఉర్దూమాతృభాషకాని విద్యార్థులకు మాత్రమే. "మాతృభాషను ఎక్కువగా నేర్పుటవల్ల ఇంగ్లీషు (ఇట్లే ఉర్దూనుకూడ) ను నేర్పుటకు ప్రతిబంధకమేమియులేదు- అట్లు ఇంగ్లీషు నేర్పుటకుముందుగా అవసరముకూడ అయియున్నది" అని సాడ్లర్ కమిటీవారు చెప్పినారు. బాలికలవిషయంలో లోయర్ మెడికల్ స్కూళ్లవరకు మాత్రము మాతృభాషలో విద్యనేర్పుటను ప్రభుత్వమువారు అంగీకరించినారు కాని ఇట్టి అర్థమనస్సులో చేసే పనులవల్ల చిరకాలమునుండి ఉన్న అసౌకర్యములు తొలగిపోవు, మాతృభాషలోనే విద్యనేర్పుకొన్న మెట్రిక్యులేటు, కాలేజిలో ఇంగ్లీషులో నేర్పే చదువును గ్రహించగలిగినట్లు బ్రిటిషిండియాలో బాగుగా రుజువైనది. కాబట్టి ఉస్మానియావిద్యాపీఠాధికారులు మార్పు చేయుటకు భయపడరాదు

సరియైన పఠనీయగ్రంథములు తగినఉపాధ్యాయులు లేకుండుట ప్రాంతీయభాషల అభివృద్ధికి అటంకముగా నున్నదనుచున్నారు, కాని అసలు సిద్ధాంతమును మనఃపూర్తిగా ఒప్పుకొన్నచో, ఈ చిల్లరచిక్కులన్నియు నేర్పేయభాషలలో పరీక్ష జరుపుటకగుచిక్కుతో పాటు బ్రిటిషుఇండియాలోవలెనే సంతృప్తికరముగ తొలగింపబడవచ్చును- బ్రిటిషుయిండియాలో ప్రభుత్వభాష అయిన ఇంగ్లీషుమాతృభాషలను స్వాధీనము చేయునట్లే ఇక్కడకూడ ఉర్దూప్రభుత్వభాషయైనను ఉర్దూమాతృభాషకాని అనేకవిద్యార్థుల విషయంలో అ సౌకర్యము కలిగించవలసిన పనిలేదు.

అసలుసిద్ధాంతమును ప్రభుత్వమువారు ఒప్పుకొని, విద్యావ్యాప్తియందు ప్రజలతోడ్పడ పెలగునట్లు చేసినచో తక్కినవి సామాన్యములను ఆదరముతో విచారించుకొనవచ్చును

ప్రధానమంత్రిగారికి బ్రిటిషు యిండియాలో చాల అనుభవమున్నది. దానితోవారు ఉర్దూ మాతృభాషకాని అల్పులకొలది విద్యార్థుల కోరికలను వ్యాయముకలిగింతురు గాక.

## హైదరాబాదు

### బజారు ధరలు

తేది ౩-౧౦-౪౧ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీవి.

| వస్తువు | పల్లా ౧కి ధర రూ అ పై |
|---|---|
| ఉచిడిసాంబల్లు | ౨౩ నుండి ౨౮౪ |
| సంబల్లు | ౨౩ ౦ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౨ ౮ ౦ |
| రాంసాగర్లు | ౨౨ ౮ ౦ |
| సావ్రకాం | ౨౦ ౪ ౦ కొత్తవి |
| ,, | ౨౨ ౦ ౦ పాతవి |
| అర్కాటి | ౨౦ ౮ ౦ ౨౦ కొత్తవి |
| ,, | ౨౨ ౮ ౦ పాతవి |
| గోనామణి | ౨౦ నుండి ౧౯౪ వరకు |
| బుడుములు | ౧౭౪ ౧౬౦ |
| దేశావళి | ౨౦ ౦ ౧ ౧౮ వరకు |
| **గోధుమలు** | |
| షర్బతి | ౨౧ ౨౨౪ |
| బన్సి | ౨౦ ౦ ౦ ౧౯౪ వరకు |
| అమ్మూరీ | ౧౯ ౦ ౦ |
| పోటేరో | ౧౮ ౮ ౦ |
| ఎర్రగోధుమలు | ౧౮ ౦ ౦ |
| **జొన్నలు** | |
| తెల్ల జొన్నలు | ౧౦౪ నుండి ౯౪ వరకు |
| పచ్చజొన్నలు | ౮ ౮ ౦ |
| మడికట్టు జొన్నలు | ౮ ౮ ౦ |
| శెనగలు | ౧౬౪ వరకే ౧౬౪ దేశీ |
| కందులు యెర్రవి | ౯ ౮ ౦ |
| మినుములు | ౧౨ ౦ ౦ |
| అలచలు | ౧౪ ౪ ౦ |
| సజ్జలు | ౯ ౦ ౧ |
| **పప్పులు** | |
| శెనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౬ ౮ ౦ |
| పెసరశెనగ ,, | ౨౧ ౨౨ ౮ ౦ |
| అలచ ,, | ౧౮ ౧ ౦ |
| మినప ,, | ౧౮ ౦ ౦ ౧౬౪ |
| పెసర ,, | ౧౯ ౦ ౦ |
| బెల్లము | ౧౭ నుండి ౧౯ వరకు |
| ఉప్పు | ౧౨, ౧౧ ౮ ౦ |
| ఉల్లిగడ్డ | ౧౬ నుండి ౧౯. కొ౧౩-౧౦ |
| వసుస మంచిది | ౨౨ నుండి ౨౨ వరకు ౩ ౨౮ [illegible] |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౭ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర , పల్ల | ౧౩, నుండి ౧౭ వరకు |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుగు ౧౨ సే. | ౭ ౮ ౦ |
| అల్లం ,, ,, | ౪ ౧౨ ౦ |
| మణుగు ౧౨ సే. | |
| కొబ్బెరనూనె ,, | ౭ ౧ ౦ |
| కుసుమనూనె ,, | ౭ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౦ ౦ |
| వేరుశెనగనూనె ,, | ౩ ౪ ౦ ౩ ౬ ౦ |
| కిరోసీన్ (గ్యాస్) డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| నెయ్యి మణుగు ౪౦ సేర్లు | |
| వినకు నెయ్యి ,, | ౬౭ ౦ ౦ |
| తెలంగాణా ,, | ౭౭ ౦ ౦ ౭౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| బంగారు తులం ౧కి | ౭౧ ౪ ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ ౪ ౦ |
| ,, తు ౧కి | ౦ ౧౧ ౬ |
| సవరన్ ౧కి పౌ. ను- | ౩౩ ౮ ౦ |
| **మూలకం** | |
| పోలీస కల్లాస్తు | ౧౭ ౧౪ ౬ |
| కల్లాలు పోలీలు | ౧౭ ౧౨ ౬ |
| ఆముదాలు బస్తా ౯, | ౯ ౮ ౦ |
| వేరుశెనగ ,, | ౮ ౪ ౦ |
| బుడ్లు పల్లా ౧కి | ౮ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుదుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు.

## భారతయువజనసంఘ వార్షికోత్సవము

కొత్తపల్లి స్టేషన్, అజూర్ ౨౫

వరంగల్లుజిల్లాలో ఈగ్రామమునగల భారత యువజనసంఘము పదునైదవవార్షికోత్సవము ౨౩ అజూర్, ౧౩౫౧ ఫ తేదీనశ్రీ మేడుసయ్యదు అలం, బి-ఏ-గారిఅధ్యక్షతన జరుపబడినది. సాయంకాలము ౫ గం-౩౦ని-లనుండి శ్రీరామాలో కస్వామి ప్రభుత్వపాఠశాలయందలి కోత్సవముతో కార్యక్రమము ప్రారంభింపబడెను. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత్ కె. నారాయణరావు గారు స్వాగతోపన్యాసము ప్రారంభించి సంఘపరిస్థితులన్నియు ప్రేక్షకులకువివరించిన పిదప శ్రీ మేడ్ సయ్యదు ఆలంగారి గుణగణములనుగ్గడించి వారినిఅధ్యక్షపీఠము నలంకరించుటకుకోరిరి. కరతాళధ్వనులమధ్య సభాధ్యక్షులవారు పీఠమలంకరించినపిదప శ్రీయుతులు మాడపాటిహనుమంతరావుపంతులుగారు ఆంధ్రోద్యమపితామహులు, హైదరాబాదుసాహుకారుల కమిటీ కార్యదర్శులు శ్రీనివాస్ రాములాల్ గ నేరివాలాగారు, శ్రీ జిరామేశ్వరరావువకీలు హైకోర్టుగారు కార్యక్రమము జయప్రదముగా కొనసాగుటకు ఆశీర్వదించుచు వ్రాసిపంపించిన సందేశములు చదివి వినిపింపబడెను. అనంతరము శ్రీయుత బి. హీరాలాలుగారిచే కార్యదర్శినివేదిక చదువబడెను. తదుపరి శ్రీయుతులు పండిత చిలుకూరి శ్రీరాములు, ఎన్-జగన్నాధరావు, హెచ్-నారాయణరావు, పి-అనంతరాంరావు, పి-దుర్గాప్రసాదరావు, ఎ అయిజయ్య, యర్రారామలింగంగుప్త, ఎన్-బి-రాఘవరావు, దుగ్గినేనితిరుపతయ్యచౌదరి, ఎన్-రామబాణము బి-ఏ-గారలచే గ్రంథాలయములు

విద్యాధికారిరాక

పాపగల్లు, అజూర్ ౨౫

ఈగ్రామము తాలూకా నాగరకర్నూలు, జిల్లా మహబూబునగర్ లో చేరినది. తేది ౭-౫-౫౦ ఫ నగ౧-౧౦-౫౦ ఫసలీన పాఠశాలాభివృద్ధికై విద్యాశాఖవారికి విన్నపపత్రములు పెట్టుకొనుటయే గాక పత్రికాముఖమున తెలియబరచియుంటిమి. తత్ఫలితముగ, తేది ౧౮-౧౨-౫౦ ఫ-ను నాడు విద్యాశాఖనాజిర్ గారు బడిపరీక్షార్థమై దయచేసిబడిపరిస్థితులను బాగుగాపరిశీలించి సంతోషమును వెలిబుచ్చుచు "ఇదివరకే మీపాఠశాలాభివృద్ధికై పైఅధికారులకు వ్రాసినాము, త్వరలో మీబడి ప్రాథమిక (తహతానియా) కాగలదనిరి.

—

విద్య, విజ్ఞానము, బాలభటోద్యమము, రైతుఉద్యమము, గ్రామపునర్నిర్మాణము, సహకారోద్యమము మొదలుగాగల ప్రజాహితసమస్యలపై ఉపన్యాసములు కావింపబడెను. తరువాతబాలకవయిత్రి శ్రీమతి పరచజానకీదేవి (జమీందారిణి, కొత్తపల్లి) గారిచే మాసంఘస్థాపకులగు కీ-శే- శ్రీయుత పరచసీతారామచంద్రరావుగారి స్మరణపూర్వకముగాను వారిచేస్థాపింపబడినసంఘము లు విజయవంతముగాసాగుటకును వ్రాసిపంపబడినపద్యము చదువబడెను. తదనంతరము అధ్యక్షులవారు పయినపేర్కొనిన సమస్యలనుగురించియు, ముఖ్యముగా మతసామరస్యమును గురించియు, యువకులకర్తవ్యములనుగురించియు, సువ్యక్తముగను ఉత్తేజకరముగను నుపన్యసించి, హైద్రాబాదులో తమయాజమాన్యముననడుపబడుచున్న కాక్రమేడ్స్ ఎసోసియేషన్ నుగురించి ఎరుకపరిచిరి. ఆహ్వానసంఘాధ్యక్షులవారి అంత్యోపన్యాసముతో కార్యక్రమము ముగింపబడెను

ఇట్లు కార్యదర్శి
నే. వి. రావు.

బాలికలఉన్నతపాఠశాల

నారాయణగూడము హైదరాబాదు దక్కన్

౩-౧౦-౪౧వాడు సాయంత్రము ౩-౩౦ గంటలకు బాదరుజాతీయకళాశాలకు ప్రిన్సిపాలుగానున్న శ్రీకొటూరువెంకటేశ్వరరావు గారున్ను మహాధనవంతుడు బుచ్చిసుందరరామశాస్త్రి గారును పైపాఠశాలను దయచేసిరి. అసమయమున చిన్న సమావేశము చేయబడి స్వాగతములచే సభ్యాగతులుసత్కరింపబడిరి. పిమ్మట శ్రీవెంకటేశ్వరరావుగారు బందరుజాతీయకళాశాలలో జరుగుచున్న వార్తా విద్యావిధానపద్ధతులను తెలుపుచు నుపన్యసించి పాఠశాలనభినందించిరి. శ్రీబుచ్చి సుందరరామశాస్త్రిగారు తామిటీవలరచించిన "సాయిబాబా" యను ద్యముల జదివిశ్రోతల నానందపరిచిరి.

—

## ముస్లింసాలెవారు

—

ముస్లింనేతగాండ్రను జేసికట్టులను గతసంవత్సరమునకె ఖాయదెమిల్లత్ బహద్దురయార్జంగుగారు స్వహస్తములతో హైదరాబాదునగరము పత్తరఘట్టిముకానాలవద్ద కూప్పనిరంజాక్ పండుగ నాడు అమ్మకముచేయుచున్నారు.

భోగింవారి శాసనము

హైదరాబాదురాష్ట్రములోని బయటిభోగముస్త్రీలు వ్యాభిచారానికై వచ్చినట్లయిన పోలీసువారిసెలవుతీసుకొని ఆరునెలలకంటె వచ్చుట-ఆటుతర్వాత వెళ్లిపవలెను.

—

## సాధన ఔషధాలయము

ఢాకా - బెంగాలు

బ్రాంచి.-- 17 A బ్రాడ్వే మద్రాసు వైద్యసలహా, కేటలాగు ఉచితము.

**శుక్రసంజీవన్:—** నపుంసకత్వమును, నరములబలహీనత, సంభోగదుర్బలమునుపోగొట్టి అధికసంభోగేచ్ఛ తీరనిశుక్రవృద్ధి, శరీరకాంతి, నరములపటుత్వమును పొందించి మిక్కిలి జీవితోత్సాహము కలుగజేయును 1/4 తొ. రూ 4 1 తొ. రూ 16

**శారిబాదిసరస (egd)** సీసా 1-కి రు 0–12–0 (1) తీవ్రమను [వైత్యతిత్తిని] సక్రమము గాకమచునట్లు చేయును (2) అజీర్ణమును పాండ్రోగిమిక్కిలి అకలినికలిగించి విరేచనము సాఫీ గా కలుగ జేయును.(3)అరికాళ్లు అరచేతులు, గుండెమంటలుతగ్గును (4)సమస్త సహామేహవ్యాధులనునివారించును (5)గనోరియావ్యాధి, దానినుండి కల్గు సమస్తమూత్రకృచ్ఛ్ర వ్యాధులను నివారించును(6)తామ్రరలు, పక్షవాతము, వాతనొప్పులు, కీళ్లు నొప్పులను పటాపంచలు చేయును (7) స్త్రీల ప్రదర వ్యాధులను వెంటనే తగ్గించును. (8)శుక్రమును గట్టిపరచి, శుక్రస్ఖలనము నరికట్టును, (9) మలేరియా పురుగుల చంపును. (10) విషనెత్తురును విరచి రక్తశుద్ధి రక్త వృద్ధి చేయును. ఆంధ్ర నైజాము సీడెడ్ జిల్లాలకు ప్రతినిధులు:—

శ్రీనివాస్ మెడికల్ & ఫ్యాన్సిమార్టు రేపల్లి, గుంటూరుజిల్లా.

ప్రతిచోట ఏజంట్లు కావలెను తదితర వివరములకు పై ఎడ్రసుకు వ్రాయుడు.

శారదాస్టోర్సు 3408 కింగ్సువే, సికింద్రాబాదు,

## దగ్గును పూర్తిగానయముచేసికొనుటకు

ట్రేడ్ మార్కు

**జాండువారి**
**కాంఫో-కోడి-వాసక**

శుభకారమగు ఔషధములు ఉపశమనముకలుగజేయుమందులుగలవు

1. త్వరలోదగ్గును నివారించును.
2. అద్భుతమైన మరియు దీర్ఘకాలమునుండి ఉన్న రొమ్ముపడిశమును పూర్తిగా నయముకాగలదు.
3. మరియు ఇతరఊపిరితిత్తుల జబ్బులకు అమోఘముగా పనిచేయును. ఈరోజేవాడండి!

**జాండుఫార్మావర్క్సు, లిమిటెడ్ బొంబాయి.**

నైజాంరాష్ట్రపు ఏజంట్లు

డి. జె, పారిఖ్ అండుకో, సికింద్రాబాదు.

---

నీవు యీరోజు మెక్లీన్తో పండ్లు తోమినావా?

అయ్యా,
తమప్రశ్నకు జవాబుగా...

ఆ! తోమినానండి!!

ముత్యములవలె తెల్లనిపండ్లు, ఆరోగ్యకరమగు చిగుళ్లు, పరిశుభ్రమగు నోరు మెక్లీన్ ఉపయోగించినచో గల్గును. త్వరలో మరకలు తొలగించి పండ్లను తెల్లగా మెరయునట్లుచేయును-ఉపయోగములోగూడ చాలా మితముగా ఖర్చగును.

MACLEANS 'PEROXIDE' TOOTH PASTE

[illegible] అమ్మబడును.

---

## దేవతా దత్తమగు 4 ఔషధములను ఉచితముగా పొందండి

1. ఉబ్బసమునకుమందు:- 60 ఏండ్లుగా చిత్రకూట్ ప్రసిద్ధిగలది. దీని ప్రభావము దేశము నాలుగుమూలల పరిచయమైనది, చిత్రకూట్ సేవాశ్రమములో శరద్ఋతువందలి పౌర్ణమిరోజునను తదితరముఖ్యమగు పౌర్ణములయందును ఉచితముగా మందు ఇవ్వబడును.
2. క్షయజబ్బుకుమందు:- దేశములోని ప్రతిస్థలమునందును ఈరోగమును కుదుర్చుటయందుఅత్యద్భుతమైనది. సంవత్సరమంతియుఉచితముగామందివ్వబడును.
3. హిస్టీరియాకు తాయిత్తు:-- బాధపడురోగి, తనుచేయు దయ్యపుచేష్టలను గోల్పోయి పూర్తిగా స్వస్థత పొందును. సంవత్సరమంతయును ఇవ్వబడును.
4. మూలమునకు తాయిత్తు:--మానవులకుచేతగాని అతీతముగ పనులుచేయును. సంవత్సరమంతయును తాయిత్తులు యివ్వబడును.

చిత్రకూట్ కు రాలేకుండ యున్నరోగులు మందు కావలెనన్న పూజచేయుటకు ఈక్రింది చార్జీలు పంపవలెను.

ఉబ్బసమునకు రు. 1–15–3, క్షయజబ్బునకు రు. 6–5–3, హిస్టీరియాకు రు. 1–5–3 మూలవ్యాధులకు రు 2–5–3 మీఅడ్రసును, పేరును, తండ్రిపేరును గోత్రముతో సహాపంపవలెను.
ఉత్తర ప్రత్యుత్తరములు హిందీలోగాని ఇంగ్లీషులోగాని జరుపవలెను.

శ్యామ్ ఆశ్రమం
పోస్టాఫీసు, చిత్రకూట్ బండా I యు. పి.

---

## ఇండియా క్రొత్త సరిహద్దులు...

ఈజిప్టు

ఇండియా తీరముకే ఇండియాకు సరిహద్దులుగా నుండు రోజులు గడచిపోయినవి. రేడియో, విమానము, వేగముగ పోవు నౌకలు, పారాషూట్ సైనికులు, పంచమదళము (గూఢచారులు) మారణము విపరీతముగా తొలగించి, వెంటనే అపాయము కలుగునట్లు చేసినవి. అమెరికాకు ముందటి రక్షణస్థానమైన అట్లాంటిక్ సముద్రము—ఇప్పుడు మిత్రులయిన గ్రేటుబ్రిటనుచే రక్షింపబడుచున్నది—అట్లే, ఇండియాకు వెలుపలి రక్షణస్థానములు ఈజిప్టు, పాలస్తీనా, సిరియా, ఇరాక్, తూర్పు ఆఫ్రికా, మలయా.

ఇందు నిమిత్తమే, శౌర్యముగల ఇండియా సైన్యములు బ్రిటను, ఆస్ట్రేలియా, న్యూజీలండు, ఇతర మిత్రబృందములనుండి వచ్చిన ధైర్యవంతులైన యోధులతో చేరి, ఈ రక్షణస్థానములను రక్షించుచు, తమ సామాన్యశత్రువును దూరముగా తరుముచున్నారు. మీరు ఈ విషయమును గమనించుటకు గమనించవలెను, ఈ మనుష్యులు, మన క్రొత్త సరిహద్దులమీద చేయు రక్షణ ఇదియే మనము మన కార్యకలాపములను నెరవేర్చుకొనునట్లును, శాంతియుత జీవితము గడుపునట్లును చేయుచున్నది.

వాటిని రక్షించుటకు సహాయము చేయుడు
డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లు కొనుడు.

ప్రతి రు 10/-
డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్టు
రు 3/9/- లాభమును యిచ్చును
పూర్తి వివరములు
పోస్టాఫీసులలో తెలుసుకొనుడు

S.I.Te.54

